chitrasahiti





# సూక్తి - సుధామధురం

## సూక్తి - సుధామధురం

----ఎ.వి.రమణరాజు



సాహితీమిత్రులారా!

మనకు మన పూర్వులనుండి సంక్రమించిన ఆస్థి
ఈ సూక్తులు వాటిని ఇక్కడ కొన్నిటిని తెలుసుకుందాం.

సూక్తి - అంటే సు- మంచి, ఉక్తి - మాట.
మంచిమాట అమృతం కంటే మధురం కదా
అందుకే దీన్ని సూక్తి - సుధామధురం అంటున్నాం.

### వీరి వద్దకు వట్టి చేతులతో పోరాదు

కొందరి దగ్గరకు పోయేసమయంలో

రిక్తహస్తాలతో(వట్టిచేతులతో) పోరాదు.

ఈ శ్లోకంలో చూడండి.

**అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీం వృద్ధ బాలకౌ**

**రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్**

అగ్నిహోత్రము దగ్గరకు - గృహమునకు - పంట పొలమునకు -

గర్భవతి చెంతకు - వృద్ధ బాలకుల చూచుటకు - రాజు, దేవుని,

గురువును దర్శించుటకు - వట్టిచేతులతో పోరాదు.

## భక్తి అని దేన్నంటారు?

ఈ శ్లోకాన్ని చూడండి

భక్తి అంటే ఏమిటో కవి ఎంత చక్కగా వివరించాడో

**అంకోలం నిజబీజసంతతి వయస్కాంతోపలం సూచికా**

**సాధ్వీ నైజ విభుం లతా క్షితిరుహం సింధు స్సరి ద్వల్లభం**

**ప్రాప్నోతీహయథా, తథా పశుపతే: పాదారవిందద్వయం**

**చేతో వృత్తి రుపేత్య తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే**

ఊడుగుచెట్టు తన విత్తనాలను తన వైపుకు ఆకర్షించినట్లు -

అయస్కాంతం సూదిని లాగినట్లు-

సాధ్వి భర్తను ఆకర్షించినట్లు-

నది సముద్రంవైపుకు ఆకర్షితమైనట్లు -

పరమేశ్వర పాదారవిందాలను విడువకుండా

ఎల్లపుడు మనసునందు నిలుపుకోవటాన్నే భక్తి అంటారు - అని భావం

## మహాత్ముల ఔదార్యం గొప్పది

ఈ శ్లోకం చూడండి ఔదార్యమంటే ఎలాంటిదో

**చాతక: త్రిచతుర: పయ: కణాన్**

**యాచతే జలధరం పిపాసయా**

**సోపి పూరయతి విశ్వంభసా**

**హన్త హన్త! మహతా ముదారతా!**

చాతకపక్షి దాహంతో మేఘుని

మూడు నాలుగు చినుకులను మాత్రమే

(తన అవసరానికి) యాచిస్తుంది.

మేఘుడు జలంతో ప్రపంచాన్నే ముంచేస్తాడు.

ఆహా! మహాత్ముల ఔదార్యం ఎంత గొప్పది.

(అడగటంలో గొప్పది - చాతకపక్షి.

ఇవ్వడంలో  గొప్పవాడు - మేఘుడు)

## ఏవి అశ్వమేధయాగంతో సమానం?

మనం అనేక పనులు చేస్తుంటాం.

వాటిలో ఏది ఎంత గొప్పదో తెలియదుకదా!

ఈ శ్లోకం చూడండి .

**దరిద్రాయ కృతం దానం**

**శూన్య లింగస్య పూజనమ్**

**అనాథ ప్రేత సంస్కారం**

**అశ్వమేధ సమం విదు:**

దారిద్ర్యంతో బాధపడే వారికి దానం చేయడం.

పూజాపురస్కారాలు లేకుండా శూన్యంగా

పడిఉన్న శివలింగాన్ని పూజించడం.

అనాథగా పడిఉన్న శవానికి దహన

సంస్కారాలు జరిపించటం -

అనే ఈ మూడు మహాత్కార్యాలు.

ఇవి అశ్వమేధయాగంతో సమానమైనవి.

వీటిలో ఏది ఆచరించినా

అపారమైన పుణ్యం ప్రాప్తిస్తుంది.

## పంచప్రాణాలు ఎక్కడ ఉంటాయి?

మాట్లాడితే నా పంచప్రాణాలు నీవే అంటుంటారు కదా
అసలు పంచప్రాణాలు ఎక్కడ ఉంటాయి
ఈ శ్లోకంలో చూడండి

**హృది ప్రాణో గుదే పాన: సమానో నాబి సంస్థిత:**
**ఉదాన: కంఠదేశస్థో వ్యాన: సర్వశరీరగ:**

మన శరీరంలో ప్రాణవాయువులు ఐదు
వాటిని ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యానములు అంటారు.
అవి మన శరీరంలో హృదయంలో ప్రాణవాయువు,
గుదములో అపానవాయువు, నాభియందు సమానవాయువు,
కంఠంలో ఉదానవాయువు, శరీరమంతా వ్యానవాయువు ఉంటుంది.
ఇవి పంచప్రాణాలు ఉండే ప్రదేశాలు.

## పుత్రుడు శత్రువట ఎప్పుడు?

లోకంలో ఎన్నో వింతలు అందులో మన జీవనమే ఒక వింత
అందులో భార్యా పుత్రులు మాత్రమేకాదు మనశరీరం సైతం వింతే,
శరీరంలో జరిగే వింతలతో వచ్చినవారే వీరంతా
సరే పుత్రుడు శత్రువట ఎప్పుడు అంటే ఈ శ్లోకం చూడాల్సిందే.

**గాత్రం సంకుచితం, గతిర్విగళితా, భ్రష్టాచ దంతావళి:**
**దృష్టిర్నశ్యతి, వర్ధతే బధిరతా, వక్త్రంచ లాలాయతే**
**వాక్యం నాద్రియతేచ బాంధవ జనై:, భార్యా నశుశ్రూయతే**
**హా కష్టం! పురుషస్య జీర్ణవయస:, పుత్రోప్యపిమిత్రాయతే!**

శరీరం ముడుతలు పడినది. నడక తూలుచున్నది.

పండ్లూడినవి. దృష్టి మందగించినది. చెవుడు పెరుగుచున్నది.

నోరు చొంగకారుతున్నది. బంధువులు మాట మన్నించటం లేదు.

భార్య మాట వినటం లేదు. ఆహా! మానవునకు ముసలితనం ఎంత కష్టం!

పుత్రుడు కూడ శత్రువుగా మారుతున్నాడు!

## సకాలములో చేయని పని ఎలాంటిది?

ఏదైనా సకాలంలో చేస్తే మంచి ఫలితాన్నిస్తాయి.

లేకుంటే ఎలా ఉంటుందో ఈ శ్లోకం చెబుతుంది చూడండి.

**నిర్వాణే దీపే కిము తైలదానం?**

**చోరేగతేవా కిము సాధానమ్?**

**వయోగతే కిం వనితా విలాస:?**

**పయోగతే కిం ఖలు సేతుబంధ:?**

దీపం ఆరిపోయిన తరువాత నూనె పోయడం ఎందుకు?

దొంగిలించుకు పోయిన తరువాత మేల్కొనటం వలన ప్రయోజనమేమి?

వయసు అయిపోయిన తరువాత స్త్రీవ్యామోహం ఎందుకు?

నీళ్ళు పోయిన తరువాత గట్టువేయడం వలన ప్రయోజనమేమి?

- సకాలంలో జాగ్రత్త పడక తరువాత ఎంత కృషిచేసినా ఏం లాభం?

అందుకే పెద్దలు దీపమం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్నారు కాదా!

## ఎప్పుడు ఈ లోకపు సుఖాలన్నీ లభిస్తాయి?

మన పెద్దలు అనేక విషయాలు చెప్పారు.

వాటిలో ఉన్న విషయాలను పాటిస్తే

తగిన సుఖం సంతోషం లభిస్తాయి.

విష్ణుపురాణంలోని 4వ ఆశ్వాసంలోని ఈ పద్యం చూడండి.

**రతితంత్రములయందుఁ బ్రౌఢయై తనమీఁద**

నత్యంతభయభక్తు లతిశయిల్ల

సౌకుమార్యముచేత నే కొదవయు లేక

సుందరాకారత నొంపు గలిగి

సరసశృంగారవేషముల నెంతయు మించి

యుచితప్రియాలాపరచన లెఱిఁగి

వినయవిధేయవివేకశీలతలచే

ననుకూలమగు నెఱతనము నేర్చి

నిర్మలాంగియు నిపుణయు నిర్మలాభి

జాత్యయును బుణ్యవతియును సతియునైన

తన కులాంగన రతికేళిఁ దనిపె నేని

యతని కైహికలోక సౌఖ్యములు గలుగు

కామశాస్త్రములందు విద్వాంసురాలై ఉండాలి.

మగనిమీద భయం, భక్తీ కలిగి ఉండాలి.

నాజూకుతనములో కొదవలేనిది కావాలి.

అందమైన ఆకారం ఉండాలి.

మనస్సుకు ఆహ్లాదం కలిగేటట్లు సందర్భానికి తగినట్లు మాట్లాడాలి.

పెద్దలయెడల అణకువ ఉండాలి. మంచిచెడులు తెలిసి ఉండాలి.

పనులపట్ల నిబద్ధత(విధేయ) ఉండాలి.

ఇవన్నీ ఉంటూ జాణతనం ఉండాలి.

ఇవన్నీ మగనికి అనుకూలమైనవి కావాలి.

శరీరం స్వచ్ఛంగా ఉండాలి. నేర్పరితనం ఉండాలి.

స్వచ్ఛమైన వంశంలోనిది కావాలి. పుణ్యవంతురాలు కావాలి.

పతివ్రత కావాలి. అటువంటి తన భార్యను రతిక్రీడలలో

సంతోషపెడితే ఆ వ్యక్తికి ఈ లోకపు

సుఖాలన్నీ లభిస్తాయి - లభించినట్లే. - అని భావం.

## ఎలాంటివారితో స్నేహం చేయాలి?

స్నేహమేరా జీవితం స్నేహమేరా శాశ్వతం

అంటూ పాటలు వింటున్నాము

అలాంటిది ఎలాంటివారితో స్నేహం చేయాలో తెలుసుకోవాలికదా

అందుకే ఈ శ్లోకం చూడండి.

**హీయతేహి మతిస్తాత! హీనైస్సహ సమాగమాత్**

**సమైశ్చ సమతామేతి విశిష్టైశ్చ విశిష్టతామ్!**

నీవు తక్కువవారితో స్నేహం చేస్తే

నీ బుద్ధి క్రిందికి దిగజారుతుంది.

నీతో సమానమైన వారితో చెలిమితో

లాభమూ లేదు నష్టమూ ఉండదు.

ఉత్తములతో స్నేహం చేస్తే

నీవు గొప్పతనం పొందగలవు.

కావున నీ చెలిమి ఎవరితో మేలో నీవే తేల్చుకో..

## ఆశ ఎంత చెడ్డది!

**భట్టనారాయణు**ని "**వేణీసంహార నాటకం**"లోని

ఈ శ్లోకం చూడండి.

**గతే భీష్మే హతే ద్రోణేzప్యంగ రాజే దివంగతే**

**ఆశా బలవతీ రాజన్ శల్యో జేష్యతి పాండవాన్**

(వేణీసంహార నాటకము - 5-23)

అతిలోకవీరుడు భీష్ముడు పడిపోయినాడు.

అఖిల ధనురాచార్యుడు ద్రోణుడు కూలిపోయాడు.

అందరికంటె తతను ఉద్ధరిస్తాడని దుర్యోధనుడు ఎవరి మీద

తన సర్వ ఆశలు నిలుపుకున్నాడో ఆ కర్ణుడూ ఒరిగిపోయాడు.

కాని ఆశ ఎంత బలమైనదో కదా!

దుర్యోధనుడు, శల్యుని సేనానాయకునిగా చేసికొని,

భీష్మద్రోణ కర్ణులవంటి మహావీరులనే పడగొట్టగలిగిన

పాండవులను గెలవాలనుకొన్నాడు

## రోగాలు ఎందుకు వస్తాయి?

ఈ సూక్తిలో రోగాలు ఎందుకు వస్తాయో?

వివరించారు చూడండి.

చరకుడు తన చరకసంహిత-లో చెప్పినది.

**అత్యంబు పానా దతి మైథునాచ్చ**

**దివాస్వపాత్ జాగరణాచ్చరాత్రౌ**

**విధారణాత్ మూత్రపురీషణాచ్చ**

**షడ్భి: మనుష్యై: ప్రభవన్తి రోగా:**

మితము, సమయము తెలియకుండా నీరు త్రాగటంవలన,

అతి సంభోగము - పగటిపూట నిద్రించుట,

రాత్రిపూట మేల్కొనుట, మూత్రపురీషములను బిగబట్టుట

- అనే ఆరు కారణాలవల్ల రోగాలు వస్తాయని - శ్లోకభావం.

## వినాశకాలే విపరీత బుద్ధి:

ఎవరికైనా పోయేకాలం వస్తే బుద్ధి పెడదారి పట్టిస్తుందట.

అందుకే పెద్దలు వినాశకాలే విపరీత బుద్ధి అన్నారు.

దానికి సంబంధించిన ఈ శ్లోకం చూడండి.

**అళీ - కుళీ - వృశ్చిక - వేణు - రంభా**

**వినాశకాలే ఫలముద్వహన్తి**

**యథా తథా సజ్జన - దుర్జనానాం**

**వినాశకాలే విపరీత బుద్ధి:**

తుమ్మెద - పీత - తేలు - వెదురు - అరటి -

ఇవి నాశకాలం వచ్చినపుడు ఫలిస్తాయి.

సజ్జనులకు దుర్జనులకు పోగాలమువేళ

విపరీత బుద్ధులు పుడతాయి - అని భావం.

తుమ్మెద, పీత, తేలు, వెదురు, అరటి ఇవి
ప్రత్యుత్పత్తి కాగానే తరువాత ఉండవట
అందుకే అవి వినాశకాలము వచ్చినపుడు
పండుతాయి అంటున్నాడు కవి.

## తలచుకొనుచు తుమ్మెదగా మారుచున్నది

ఏవరు ఏది ఎక్కువగా తలచుకొంటారో వారు అదే అవుతారు.
మనిషి చనిపోయే
సమయంలో ఏది స్మరిస్తాడో
తరువాతి జన్మలో అలానే పుడతాడట.
ఈ శ్లోకం తెలిపే సూక్తి చూడండి.

**సతి సక్తో నరో యాతి సద్భావం హ్యే కనిష్ఠయా**
**కీటకో భ్రమరం ధ్యాయన్ భ్రమరత్వాయ కల్పతే**

సజ్జనులతో నిరంతరం సంబంధం వలన మానవుడు
సజ్జనుడుగా మారును.
పురుగు తుమ్మెదను తలచుకొనుచు
తుమ్మెదగా మారుతున్నదికదా - అని భావం.

## వస్తా వట్టిది పోతా వట్టిది

ప్రతిమనిషి ఈ ప్రాణం ఉన్నంతవరకు
అదినాది ఇదినాది అని వెంపర్లాడతాడు
కానీ ఈ ప్రాణమే పోతే ఎవరెవరు
ఎక్కడిదాకా వస్తారని
ఈ శ్లోకంలో కవి వివరించాడు
చూడండి.

**ద్రవ్యాణి భూమౌ పశవశ్చ గోష్ఠే**
**భార్యా గృహద్వారి జన శ్మశానే**
**దేహశ్చితాయాం పరలోకమార్గే**

**కర్మానుగోగచ్ఛతి జీవ ఏక:**

సంపాదించినవన్నీ భూమిమీద -

పశువులు శాలలో- భార్య ఇంటివాకిట్లో-

బంధువులు శ్మశానం దగ్గర-

దేహం చితియందు మిగిలిపోతాయి.

జీవుడు మాత్రం కర్మవెంట

ఒంటరిగా ప్రయాణించును - అని భావం.

## అదొక్కటేకాదు ఇదికూడా ఉండాలె

మంచి పేరు అందం ఉంటేచాలదు

దానికితోడు మంచి మనసు కూడా

ఉండాలందున్నాడు కవి నిజమేకదా!

కవి అన్యాపదేశంగా చెప్పిన

ఈ శ్లోకం చూడండి

**దిఙ్మండలం పరిమళై: సురభీ కరోషి**

**సౌందర్య మావహసి లోచన లోభనీయం**

**అహో! రసాలఫలవర్య! తవాస్మిదూయే**

**యత్తుందిలంచ కఠినం హృదయం బిభర్షి**

ఓ తీయ మామిడి ఫలమా!

నీ సువాసనతో దిక్కులు పరిమళించుచున్నవి.

బంగారు రంగుతో సుందరంగా ఉన్నావు.

కాని కఠినమైన పెద్దటెంకను మనస్సుగా ధరించటం

మాత్ర బాధగా ఉంది - అని భావం.

## ఏవి విషముతో సమానం?

ఈ శ్లోకం చూడండి.

**అనభ్యాసే విషం శాస్త్రం**

**అజీర్ణే భోజనం విషమ్**

**దరిద్రస్య విషం గోష్ఠీ**

**వృద్ధస్య తరుణీ విషమ్**

అభ్యాసము చేయనివానికి శాస్త్రం విషం

అజీర్ణంగా ఉన్నపుడు భోజనము(తినడమే)విషం

దరిద్రునికి మంచివిషయాలు వినడం విషం

ముసలితనంలో పడుచు పెళ్ళాము విషం

ఇవన్నీ విషాలే లేదా విషంతో సమానమైనవే.

వీటిలో కాదనేదేదైనా ఉందా? లేదుకదా!

## ఎవరితో కలువకూడదు?

**మంత్రి యప్పన్న** **చారుచర్య**లో చెప్పిన పద్యం

ఎటువంటి స్త్రీతో కలువకూడదో

ఇందులో వివరించారు చూడండి.

**వనితలు సంభోగమున వర్జనీయులు**

**తగఁదన్ను నేలునాతని పురంధ్రి**

**బంధువునిల్లాలు బ్రాహ్మణోత్తము భార్య**

**చెలికాని పడఁతి వీరలఁదలంప**

**మాతృసమానలు మనువు దప్పిన యింతి**

**కన్నియ ముదిసిన కాంత రూప**

**శీలగుణమ్ములచేత నిందితయైన**

**మగువయుఁ దనజాతి మాత్రకంటె**

**నతిశయంబగు వర్ణంబునతివ బొగ్గు**

**చాయ మేనిది కడుఁబల్ల చాయ పడఁతి**

**పెద్దవళులది కడురోగి తద్ద బడుగు**

**గేడి గుజ్జనఁబడువీరిఁగూడఁజనదు**

(చారుచర్య - 57)

**సంభోగంలో విడిచి పెట్టవలసిన స్త్రీలు -**

1. **తన యజమాని భార్య**

2. **బంధువు భార్య**

3. **ఉత్తమబ్రాహ్మణుని భార్య**

4. **స్నేహితుని భార్య**

**వీరు తల్లి వంటి వారు.**

**వీరు కాకుండా ఇంకా**

**చెడిపోయిన స్త్రీ, రజస్వలకాని స్త్రీ, వృద్ధురాలు**

**రూపం- శీలం - గుణం లేని స్త్రీ, తనకంటే పైజాతికి చెందిన స్త్రీ,**

**బొగ్గులాంటి నల్లని రంగుకల స్త్రీ, ఎర్రరంగు(పల్ల- పాటల వర్ణం) కలది.**

**పొట్టపై పెద్దపెద్ద ముడుతలు కలది, పెద్ద జబ్బున్నది, బాగా ఓపికలేనిది,**

**పొట్టిపొట్టి కాళ్ళు చేతులు(గుజ్జు అనబడు) శరీరంగలది**

**ఇటువంటి స్త్రీలతో సంభోగించరాదు.**

## మహిళ ఆసక్తురాలైతే

ప్రాకృతంలోని **భవభావన** అనే గ్రంథంలో 12 భావనలున్నాయి.

దీనిని క్రీ.శ. 1112 న **మలధారి హేమచంద్రసూరి** రచించాడు.

అందులోని సూక్తులలో ఇప్పుడు ఒకటి చూద్దాం-

**మహిలా హు రత్తమేత్తా ఉచ్ఛుఖండం వ సక్కరా చేవ**

**హరఇ విరత్తా సా జీవియంపి కసిణాహిగరలవ్వ**

మహిళ ఆసక్తురాలైతే

దానిలో చెరకు ముక్కలలోవలె,

పంచదారలో వలె తీపి ఉంటుంది.

ఆమె విరక్త అయితే కృష్ణసర్పం వలె

దాని విషం ప్రాణాంతకమౌతుంది- అని భావం.

ఇది వెయ్యి సంవత్సరాల క్రిందటి మాటకదా!

ఇప్పుడేమైనా మార్పుందేమో లేక

ఇదే నిజమో అనుభవజ్ఞులు తెలియగలరు.

**పురుషుడు చూడకూడనివి**

మన పూర్వులు చెప్పిన విషయాలు

ఎంత గొప్పవో తెలుసుకోవడం

వాటిని ఆచరించడం మనం చేయాల్సిన విధి.

సూక్తులు ఎన్ని విన్నా లాభంలేదు

వాటిని వీలైనంతవరకు ఆచరణలో ఉంచాలి

ఇప్పుడు పురుషుడు చూడకూడనివేమిటో

తెలుసుకొందాము

**నాం జయతీం స్వనేత్రచ**

**నచా భక్ష్యా మనావృతమ్**

**నవ శ్యేత్ప్రసవం తీంచ**

**తేజస్కామో నరోత్తమ:**

భార్య కంటికి కాటుక దిద్దుకుంటున్నా,

తలారా స్నానం చేస్తున్నా,

నగ్నంగా ఉన్నా, ప్రసవిస్తున్నా

చూడరాదు. ఇవి పురుషుని

తేజస్సును హరిస్తాయి - అని భావం.

**నాస్తి శోకసమో రిపు:**

**రామాయణంలోని ఈ శ్లోకం చూడండి**

**ఎంత చక్కని సూక్తిని వివరిస్తున్నదో**

**శోకో నాశయతే ధైర్యం**

**శోకో నాశయతే శ్రుతమ్**

**శోకో నాశయతే సర్వం**

**నాస్తి శోకసమో రిపు:**

**శోకం ధైర్యాన్ని నాశనం చేస్తుంది**

**శోకం వివేకాన్ని నాశనం చేస్తుంది**

**శోకం అన్నిటినీ నాశనం చేస్తుంది**

**కావున శోకంతో సమానమైన శత్రువులేడు**

**- అని భావం.**

## పరోపకారుల స్వభావము ఎలాంటిది?

పరోపకారం మిదం శరీరమ్ అన్నది ఆర్యోక్తి.

మరి పరోపకారులకు సంబంధిచి

వారి సహజగుణం  లేక స్వభావం

ఎలాంటిదో తెలియాలంటే  కాళిదాసు చెప్పిన

ఈ శ్లోకం చూడాల్సిందే.

**భవన్తి నమ్రా స్తరవ: ఫలోద్గమై**

**ర్నవాంబుధి ర్దూరమిలంబినో ఘనా:**

**అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభి:**

**స్వభావ ఏవైష పరోపకారిణామ్**

(అభిజ్ఞాన శాకుంతలం -5-13)

ఫలాలు ఎక్కువైనకొలది  వంగుతాయి చెట్లు.

నీటిని ఎక్కువగా ఉన్న మేఘాలు

విశేషంగా  క్రిందికి వంగి ఉంటాయి.

సత్పురుషులకు ఐశ్వర్యం కలిగే కొలది

వినయం కలిగి ఉంటారు.

పరోపకారులకిది స్వభావము కదా - అని భావం

పరోపకారం చేసేవారు వినయంతో

వంగి ఉంటారని గ్రహించాలి.

అదే వారి సహజగుణం లేదా స్వభావం.

## ఎవరిని ధీరుడు అంటారు ?

ధీరుడు అంటే బాగా బలమున్నవాడా,

లేక దేన్నయినా ఎదుర్కొనగలిగేవాడా,

ఎవరిని ధీరుడు అంటారు అంటే

గీతలోని అంటే భగవద్గీతలోని

ఈ శ్లోకం చూడాల్సిందే.

**సమదు:ఖసుఖ: స్వస్థ: సమలోష్టాశ్మకాంచన:**

**తుల్య ప్రియాప్రియో ధీర: తుల్య నిందాత్మసంస్తుతి:**

(భగవద్గీత - 14-24)

సుఖాన్ని దు:ఖాన్ని సమానంగా భావించి, ఆత్మస్థుగా ఉంటూ

మట్టి పెళ్ళనైనా రాతినైనా బంగారాన్నైనా ఒకటిగా చూస్తూ,

ఇష్టం అయిష్టాలను, నిందను ఆత్మస్తుతులను సమానంగా

ఎవడు తీసుకుంటాడో వాడే ధీరుడు. మిగిలినవారు కాదు.



Add files

## Comments



రమణరాజు. ఏ.వి.

Add a comment